శ్రీ

# శ్రీప్రసన్నాంజనేయము



రచయిత


గుంటూరుజిల్లా ప్రత్తిపాడుగ్రామవాసి

శ్రీ ప్రతాప రామయ్యగారి జ్యేష్ఠపుత్త్రుఁడు

ప్రతాప హనుమయ్య

గుంటూరుమండల వేదప్రవర్ధక విద్వత్పరీక్షాసభా

కార్యస్థానస్థ పౌరాణికులు

గుంటూరు - బ్రాడీపేట, నాల్గవవీధి.



ప్రకాశకులు :

శ్రీ హనుమదుపాసక

శ్రీ లంక వేంకటేశ్వరశాస్త్రి

భిషగ్రత్న

అనందతీర్థ అగ్రహారము, గుంటూరు.

1954 [ అమూల్యము

ఉభయభాషాప్రవీణ, వేదాంతపారీణ, విశేషజ్ఞ,

మిన్నికంటి గురునాథశర్మగా రిట్లు వ్రాయుచున్నారు.

గీ॥ సుప్రసిద్ధులు పౌరాణిక ప్రముఖులు
శ్రీ ప్రతాప హనుమదభిఖ్య ప్రథితులు
శ్రీ ప్రసన్నాంజనేయ కావ్య ప్రణేత
లై ప్రతిభ వెల్లడించి రార్యప్రియముగ.

మ॥ ఒకచో భక్తి స్రవించుచుండు, నొకచో
నూటాడుఁ ద్రయ్యంత మిం
కొకచో లౌకికగాథలూరు నొకచో
సూక్తుల్ విరాజిల్లు వే
ఱొకచో నాత్మకథాప్రణామములు వె
ల్గొందుం బ్రసన్నాంజనే
య కృతిం గమ్మని జాను తెన్గునుడితో
నౌరా యనం బండితుల్.

ఆ॥ మీకు సహజమైన మృదుపదబంధంబు
సవినయ ప్రసంగ సరణి మధుర
మంజుబోధలు హనుమచ్ఛాస్త్రిగారు! మీ
కబ్బమందు నుంట కబ్బురంబె?

శ్రీ మద్గురుభాగవత రచయిత
మిన్నికంటి గురునాథశర్మ,
ప్రధానాంధ్రపండితులు, హిందూకాలేజి హైస్కూలు,
గుంటూరు

గుంటూరు
20-12-54

శ్రీ శివాయ గురవే నమః

# మిత్రప్రశంస

1. శ్రీ ప్రసన్నాంజనేయమ్ము శ్రీప్రదమ్ము
ముద్రితమ్ముగఁజేసిన భద్రయశుల
కగుత పూర్ణాయురర్థసౌఖ్యప్రదమ్ము
ధర్మగుణయుతపుత్రపౌత్రప్రదమ్ము.

2. ప్రథిత ముదిగొండవంశపావనుఁడు ఘనుఁడు
సద్గుణుఁడు శ్రీసుబ్రహ్మణ్యశర్మగారు
ఓరియంటల్ పవర్ ప్రెస్సువారు దీని
భక్తి ముద్రించి పుణ్యంబు బడసినారు.

3. లంకవంశీయుఁడు సువర్చలాసమేత
పంచముఖవీరహనుమదుపాసకుండు
వేంకటేశ్వరశాస్త్రి సంప్రీతి దీనిఁ
బ్రకటనమొనర్చె నిర్వ్యాజభక్తిపరుడు.

ఇట్లు,
రచయిత, శ్రేయోఽభిలాషీ
ప్రతాప హనుమయ్య

శ్రీరస్తు ॥ శుభమస్తు

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ సీతారామాంజనేయ సద్గురుభ్యో నమః

# శ్రీ ప్రసన్నాంజనేయము

సీ. శ్రీసిద్ధిగణనాథు ♦ సేవించి కృతినెంచి
సరసోక్తి శ్రీసర ♦ స్వతి నుతించి
బ్రహ్మాదిదేవతా ♦ ప్రార్థనం బొనరించి
తల్లిదండ్రులకు వం ♦ దనమొనర్చి
కడుభక్తి గురునమ ♦ స్కారంబు గావించి
జ్ఞానయోగులకు నం ♦ జలి ఘటించి
వేదశాస్త్రరహస్య ♦ విదులకెల్లను మ్రొక్కి
పండితసత్క ♦ వి ప్రణుతి సలిపి

తే.గీ. నీ సములు లేరులేరని ♦ నీసములను
నీ మహిమ నిల్పి వర్ణింతు ♦ నేర్పు వెలయ
ఘనకృపాలయ! ప్రత్తిపా ♦ డ్గ్రామనిలయ!
అమరగణగేయ! శ్రీ ప్రస ♦ న్నాంజనేయ!! 1

సీ. భరతఖండంబున ♦ బంగారుకొండకు
దక్షిణదిశఁ బర్వ ♦ తంబులందు
శ్రీశైలమనుదాని ♦ కీశాన్యమున నొప్పు
కృష్ణవేణీనదీ ♦ క్షేత్రములను
అమరావతియు మంగ ♦ ళాద్రియు దాపుగాఁ
బరగును గుంటూరు ♦ పురవరంబు

దానికిఁ బదిమైళ్ళ ♦ దక్షిణంబుననున్న
ప్రఖ్యాతిపాడను గ్రామ ♦ వాస జనుల
తే.గీ. పుణ్యవశమున భక్తులఁ ♦ బ్రోవఁదలఁచి
నిలిచితివి సుప్రతిష్ఠిత ♦ నిష్ఠ వెలయ ॥ఘన...॥ 2

సీ. శ్రీరాముఁ డెప్పుడు ♦ సీతాసమేతుఁడై
నీ పూజలను మెచ్చు ♦ నియతి నుండు
వేణుగోపాలుండు ♦ వేడుకల్గను చుండుఁ
జిరకాలమును నీదు ♦ చెలిమి బలిమి
నీ జన్మకర్మముల్ ♦ నెఱిఁగన్న "పార్వతీ
దండేశ్వరుల్" సదా ♦ దలఁచు చుంద్రు
నీ మహిమకుఁ దోడు ♦ నీడలై గణపతి
వీరభద్రులు నిన్ను ♦ విడువకుంద్రు
తే.గీ. దేవతలు సూడఁ ♦ గా గ్రామదేవతలుగఁ
గొలిచియుందురు నీయాజ్ఞ ♦ మెలఁగుచుంద్రు ॥ఘన...॥ 3

సీ. నష్టసంతాన చిం ♦ తావార్థి నింకింప
బడబాగ్ని నీ మంత్ర ♦ పటలశక్తి
భూతభేతాళ ప్ర ♦ భూతోగ్రరుజ మాన్ప
దివ్యౌషధంబు నీ ♦ భవ్యమూర్తి
పరమంత్రతంత్ర సం ♦ ప్రాప్త బంధముఁ ద్రెంప
నిరుపమతీక్ష్ణాసి ♦ నీ త్రివంబు
మారీ, మసూచికా ♦ మారణాహ్వులఁ జంప
నకులమ్ము నీపూజ ♦ నమ్ము సుమ్ము

తే.గీ. పరమపురుషార్థదమ్ము నీ ♦ భజనమన్న
నైహికాముష్మికఫలమ్ము ♦ లడుగవలెనె ? ॥ఘన...॥ 4

సీ. నియమపూజావ్రత ♦ నిష్ఠులై ననుఁ గొల్చి
నా తల్లిదండ్రులు ♦ నన్నుఁ గనుట
నీవె తమకుఁ బుట్టె ♦ నావని శ్రద్ధతో
హనుమయ్యయను పేర ♦ ననుఁ బిలుచుట
నినుఁగన్న రీతిగా ♦ ననుఁగన్నవారును
మించినప్రేమఁ బో ♦ షించుకొనుట
ఆదిలక్ష్మినిఁ దల్లి ♦ యని, తండ్రియని రాముఁ
గను భాగ్య ముభయులఁ ♦ గలదియగుట
తే.గీ. నిన్ను భగవంతుఁడని నమ్మి ♦ యున్న నాకు
సన్నుతింపంగ మదిని ను ♦ త్సాహ మొదవె ॥ఘన...॥ 5

సీ. శ్రీరామతత్త్వమ్ము ♦ సీతామహాశక్తి
కృపఁగన్న ప్రజ్ఞాన ♦ నిపుణమూర్తి
సాంగ వేదార్థమ్ము ♦ సవితృగురూపాస్తి
సంగ్రహించిన ధీవి ♦ శాలమూర్తి
మైత్ర్యాది వర్గమ్ము ♦ మాకాంత సేవనా
సంతుష్టిఁ బడసిన ♦ శాంతమూర్తి
శూరలోకపథమ్ము ♦ సుగ్రీవవిభునాజ్ఞఁ
దలఁదాల్చి మెలఁగిన ♦ ధర్మమూర్తి
తే.గీ. ముందునకు బ్రహ్మ గాఁబోవు ♦ పుణ్యమూర్తి
నే స్తుతినా ? నిన్నుఁబొగడఁ ద్రి♦మూర్తిమూర్తి ॥ఘన...॥6

సీ. జాతకఫలనుతి ♦ సలుపుదునా ? గ్రహ
పతినిఁ జేతులఁబట్టి ♦ వదలినావు
చేష్టావిచారణ ♦ చే వినుతింతునా ?
అతిలోకచర్యల ♦ నలరు దీవు
కాలానుసరణంబు ♦ గాఁ బ్రస్తుతింతునా ?
కలివినిగ్రహదీక్ష ♦ గలదు నీకు
పూర్వగాథలతోడఁ ♦ బొగడుదునా ? నిన్నుఁ
గతగోష్ఠి విసువుగాఁ ♦ గందు రెందు
తే.గీ. అచ్చమైనముఖస్తుతి ♦ కిచ్చగింప
వచ్చెరువు నిన్ను వర్ణింప ♦ నమలచరిత ॥ఘన...॥

సీ. నిను, సృజించెడు బ్రహ్మ ♦ వని భజించినమాత్ర
నతనిసాలోక్యంబు ♦ నందవచ్చు
నిను, రక్షకుఁడు విష్ణు ♦ వని నుతించినయంత
నతనిసామీప్యంబు ♦ నందవచ్చు
నిను, లయకర్తరు ద్రునిగ ♦ నెంచినఁజాలు
నతనిసారూప్యంబు ♦ నందవచ్చు
నినుఁ, ద్రిమూర్త్యాత్మకుఁ ♦ డనితలంచిన యప్డె
డఖిలాత్మసాయుజ్య ♦ మందవచ్చు
తే.గీ. నిన్నుఁబరమాత్మగా మది ♦ నిశ్చయించి
సచ్చిదానందఘనుఁడై యె ♦ సంగవచ్చు ॥ఘన...।

సీ. కొనియాడవలెనన్న ♦ కోర్కెమెండేకాని
మఱియొక్కరీతి సా ♦ మగ్రిలేదు

నుతియింపవలెనన్న ♦ కుతుకమెక్కువె కాని
మదినిల్పుకోనేడు సా ♦ మర్థ్య మరుదు
ప్రస్తుతింపంగఁ గే ♦ వలబుద్ధియే కాని
వైదుష్యసరణి నే ♦ వంకఁ గనను
ప్రార్థింపవలెనన్న ♦ పట్టుదలయె కాని
విధ్యుక్తమైన వి ♦ వేక మెఱుఁగ
తే.గీ. ఎట్లుకొనియాడ నుతియింప ♦ నెట్లు ప్రస్తు
తింపఁ బ్రార్థింప, నీ కృప ♦ నింపకున్న? ॥ఘన...॥ 9

సీ. నీ కృపాబలమున ♦ నింగి నేలను తాళ
ములుసేసి వాయింప బ్రహ్మా ♦ యు దిశలు
నీ యనుగ్రహశక్తి ♦ నిఖిలాండము ల్ద్రోయ
వింతగా నెగురుఁ జే ♦ బంతులట్లు
నీ దయాసామర్థ్య ♦ నియతి శాసింపంగ
బ్రహ్మాదివరదులుఁ ♦ బరుగిడుదురు
నీ ప్రసాదమహత్త్వ ♦ నిష్ఠాత్ములై సేయు
పనులన్నియును ఫల ♦ వంతములగు
తే.గీ. స్వామి! వేయేల? సర్వ ని ♦ ర్వాహమునకుఁ
జాలు నీదుకటాక్ష వీ ♦ క్షణ మొకండు ॥ఘన...॥ 10

సీ. శ్రీరామపదభక్తి ♦ చే లభించువిరక్తి
ముక్తికన్యాసక్తి ♦ మొనయఁజేయు
శ్రీరామశుభమూర్తి ♦ సేవయం దనురక్తి
యన్యకాంతాసక్తి ♦ నవలఁద్రోయు

శ్రీరామగుణకీర్తిఁ • జెవులార వినుయుక్తి
నీతిమార్గాసక్తి • నిలునఁజేయు
శ్రీరామనామోక్తి • నోరార ననుశక్తి
సర్వేంద్రియాసక్తి • సడలఁజేయు
తే.గీ. నని జగంబులఁదెలుప నీ • జననవర్తి
నమ్మ లవుఁగాక, మఱి కారణమ్ముఁ గలదె? ॥ఘన...॥ 11

సీ. పుట్టి నీ వటు చేసి • నట్టి చేష్టలఁబట్టి
యిట్టివాఁ డీశ్వరమీశుఁ • బుట్టఁడనుట
నీ శక్తి యెన్నఁడు • నీకుఁదోఁచనియట్లు
కోపించి మునులయ్యు • శాపమనుట
బ్రహ్మాస్త్రమునకైన • బాధలేదని నీకు
బ్రహ్మాదులే వచ్చి • వరములనుట
పవిచెడ నీదు చెం • పను గుర్తువడనేసి
యింద్రుం డితఁడు గపి • చంద్రు డనుట
తే.గీ. చూడఁగా నీవు • బ్రహ్మార్క జాడ దోఁచు
సకలసంస్కార సంసిద్ధి • సత్త్వబుద్ధి ॥ఘన...॥ 12

సీ. నీ మాట నే నమ్మ • నిజముగాదందువా ?
నూరాదు లే • యపారఁ దూఱఁగలరు ?
నీ యూహ నేనెంచ • నిస్సారమందువా ?
నిగమాదు లేచోట • నిలువఁగలవు ?
నీ యుక్తి నేమెచ్చ • నిర్లక్ష్యమందువా ?
సృష్టిస్థితిలయాది • చేష్టలేమి ?

నీ క్రియ నే నొప్ప ♦ నిష్ఫలమందువా?
నిద్రాసుఖంబులే ♦ నిదియె యగును
తే.గీ. ఇన్నియును నీ వెఱుంగని ♦ వే మహాత్మ?
అన్నిఁటికి మూలమైన ని ♦ న్నెన్నఁదరమ? ॥ఘన...॥ 13

సీ. శివతేజ మొక్కంత ♦ యవశమ్ముగా నగ్ని
పరికించి యది ♦ వాయువశముఁ జేయ
వాయువుఁ దనుఁగూర్చి ♦ భక్తి నీ తలిదండ్రు
లంజనాకేసరు ♦ లమలమతులు
పూజాదికము సల్ప ♦ బుత్త్రార్థులని యిచ్చె
శంభువీర్యము సుప్ర ♦ సాదమనుచుఁ
గైకొని నిన్నిట్లు ♦ గన్నవా రరయంగ
వానరాకృతినిఁ బా ♦ ర్వతియు శివుఁడుఁ.
తే.గీ. గ్రీడ సల్పిరిగా యంద్రు ♦ క్రియకు ఫలముఁ
బుట్టఁ జెప్పిరి నీ విట్లు ♦ పుట్టినట్లు ॥ఘన॥ 14

సీ. పాలనాఁడే రవి ♦ పండైన నీ కెట్లు
పానకాల్చిన్ని య ♦ ప్పాలు సాలు?
సీతాజనని విశ్వ ♦ సింపంగఁ జూపిన
నీ యాకృతికి దివ్య ♦ నిలయ మేది?
బ్రహ్మాదు లొసఁగిన ♦ వరము లక్కఱ నీవు
వాడుకొన్నది ♦ యొక్కనాఁడు గాన
మొక రాజు సేవించి ♦ యున్న వానరవరుల్
నీవలె మహిఁ ♦ బూజనీయులైరె?

తే.గీ. పరమగోప్యము దివ్య ప్ర ♦ భావయుతము
నీచరిత్రము శుభదము ♦ నిజము సతము ॥ఘున...॥ 15

సీ. దశమి రోజునఁ బుట్టి ♦ దర్శసూర్యునిఁ బట్టి
మ్రింగు రాహువు నెట్టి ♦ మెలఁగె నెవఁడు
ఉదయాస్తగిరులపై ♦ బదములూని రథస్థ
రవిముఖంబున విద్య ♦ లెవఁడు గఱచె
నర వానర ప్రభు ♦ వరయుగ సమ్మతి
నేకరీతిగ సల్పి ♦ యెవఁడు గొలిచెఁ
బరులచేఁ బడి దాచఁ ♦ బడిన శ్రీ జానకి
క్షేమ మెవ్వాడు ♦ గని చెప్పెఁ బతికి
తే.గీ. ఆతఁడవు నీవ గాన బ్ర ♦ హ్మణ్యమూర్తి
వానరులు విద్యగలవారు ♦ భటులుగారెఁ ॥ఘున...॥ 16

సీ. జానకి జాడకై ♦ వానరపతి నిన్నుఁ
దక్షిణదిశ కేల ♦ తఱుమవలయుఁ
దఱుముచో రాముండుఁ ♦ దన యుంగరముఁ దీసి
నీచేతి కేల యం ♦ దింపవలయు
అందుచో జాంబవ ♦ దాదు లసూయనుఁ
జెందక ని న్నేల ♦ చేరవలయుఁ
జేరిరో మితిమీరి ♦ వారెవ్వరును రాక
ని న్నేల లంకకు ♦ నెట్టవలయు
తే.గీ. నెట్ట నీ పుట్టి మునిఁగిన ♦ యట్టు పోయి
తల్లిఁగని రాఁగ నినుఁ దండ్రి♦దైవ మనిరె ॥ఘున...॥ 17

సీ. శ్రీరామభక్తులు ♦ గారొ ? విభీషణ
జాంబవదాదులు ♦ సన్నుతింపఁ
బ్రభువరానుగ్రహ ♦ పాత్రులు గారొకొ ?
యంగదాదులు కొని ♦ యాడుటకును
గురుకృపాసంపత్తిఁ ♦ గోవిదులేగారొ ?
నల నీల ముఖ్యులు ♦ నతులు సేయ
దైవబలప్రాప్త ♦ ధన్యులు గారొక్కొ ?
వాలి సుగ్రీవులు ♦ ప్రస్తుతింప
తే.గీ. వారి నెన్నక నిన్నెన్న ♦ వలె నటన్న
బుద్ధి బహుజన్మ పరిపాక ♦ సిద్ధిఁ గలుగు ॥ఘన...॥ 18

సీ. ననుఁగాదు నాదైవ ♦ ముని రాముని భజింపు
మందువా ? నిను దైవ ♦ మని యెనతఁడు
ననుఁగాదు నా గురు ♦ దిననాథుని నుతింపు
మందువా ? నిను నల్లుఁ ♦ డను నతండు
ననుఁగాదు నాతండ్రి ♦ ననిలుని సేవింపు
మందువా ? నినుఁ బ్రాణ ♦ మను నతండు
ననుఁగాదు నావంటి ♦ జను నన్యుఁ గొనియాడు
మందువా ? నీ వంటి ♦ యతఁ డితరుఁడె ?
తే.గీ. నీవెకా దైవగురు పితృ ♦ భావములను
బ్రాణులఁ జెలంగి మెలఁగుదు ♦ పరమపురుష ॥ఘన...॥ 19

సీ. "నీబుద్ధి మాన్పంగ ♦ నేరరెవ్వరు" స్వామి !
"నీవు మాన్పకు మెప్డు ♦ నిన్నుఁ దలఁతు"

"నీకర్మమును ద్రుంప ♦ నేరరెవ్వరు" తండ్రి!
"నీవు ద్రుంపకు సదా ♦ నీ కొనర్తు"
"నీయదృష్టము దీయ ♦ నేరరెవ్వరు" ప్రభూ!
"నీవు తీయకు మంత ♦ నీకు నిత్తు"
"నీకు జన్మము లీయ ♦ నేరరెవ్వరు" దేవ!
"నీ విమ్ము సతతమ్ము ♦ నిన్నుఁ గొలుతుఁ"
తే.గీ. గాద? నన్నెంచుకునుఁ జేతఁ ♦ గానివానిఁ
జేయుమా; వాదమేటికి ♦ శిష్టచరిత! ॥ఘన...॥ 20

సీ. సద్భక్తితో నిన్ను ♦ సన్నుతించెదఁగాని
పాండిత్యగరిమఁ ♦ జూపంగఁగాదు
శాస్త్రోక్తి నీ పూజ ♦ సల్పుచుండునుగాని
జనులెల్లఁ జూచి ♦ మెచ్చంగఁగాదు
నీ జపమ్ము గురూక్తి ♦ నియతిఁ జేయుదుఁగాని
యితరులేమియు నాకు ♦ నీయఁగాదు
భవదద్భుత ప్రభా ♦ వమును జాటుదుఁగాని
లవ మన్యదేవ ♦ హేళనము గాదు
తే.గీ. సర్వసాక్షివిగావున ♦ నిర్వచింతుఁ
దగవుగాకున్న మాన్పఁగా ♦ దగుదువనుచు ॥ఘన...॥ 21

సీ. సకలలోకజ్ఞాన ♦ సంపత్తి చాలునా?
తెలఁజేసి నీ మూర్తి ♦ నిలువఁజేయ
సాంగవేదార్థ వి ♦ జ్ఞానంబు చాలునా?
నీ రూప మిదియని ♦ నిర్ణయింప

సర్వయోగోద్భవ • సంసిద్ధి చాలునా ?
నీ స్వరూపజ్ఞాన • నిష్ఠఁ దెలుప
ఘనతపస్స్వాధ్యాయ • గతి చాలునా ? నీదు
కామరూపతఁ • గనుంగవఁ గనంగఁ
తే.గీ. జాలవేవియు నీ భక్తి • చాలినట్లు
స్వస్వరూపానుసంధాన • శక్తి భక్తి ॥ఘన...॥ 22

సీ. ఆధారమునఁ గల్పి • తార్థంబులకు సత్త్వ
మెపుడు లేదని నిశ్చ • యించు భక్తి
నామరూపములఁ బెనంగొన్న • జగమును
విడఁదీసి కలిపి చూ • పించు భక్తి
మరుమరీచి జలమ్ము • మాడ్కి, స్వప్నమురీతి
దృశ్యమ్ము మిథ్యగాఁ దెలుపు • భక్తి
నిజసుఖరూపంబు • నిద్రయందు, సమాధిఁ
గనఁజేయు ననుభవం • బునను భక్తి
తే.గీ. రమ్యగుణగణ పూజ్యాను • రక్తి భక్తి
మోక్షసాధన సామగ్రి • ముఖ్యభక్తి ॥ఘన...॥ 23

సీ. స్థానముల్ ప్రాణముల్ • దప్పఁగా మొఱపెట్టె
భయమున గజరాజు • బ్రదుకుకొఱకు
మానంబుఁ గాపాడు • మా యనె సిగ్గుచే
ద్రౌపది లోకమ • ర్యాదకొఱకు
శరణుచొచ్చెను విభీ • షణుఁడు నేర్పునఁ గుల
వైరి రాముని ప్రాభ • వమ్ముకొఱకు

సవతితల్లి యుపదే ♦ శానఁ గాన ధ్రువుండు
దపియించె నధికప ♦ దంబు కోఱకు
తే.గీ. ఈవు, ప్రహ్లాదుఁడు భజించు ♦ టెందుకోఱకో ?
యెఱుఁగ మిము వారితోఁ జేర్చ ♦ టెందుకోఱకో ॥ఘన॥ 24

సీ. రాక్షసవానరుల్ ♦ ప్రహ్లాదుఁడును నీవు
వరములోల్లక ♦ భగవంతుఁ డనుచు
పాఁపజాతినిఁ బుట్టి ♦ ప్రభుపైన శేషుండు
పదమడుగక భగ ♦ వంతుఁ డనుచు
పక్షికులాగ్రణి ♦ వైనతేయుఁడు తిండి
బత్తెము ల్వీడి భగ ♦ వంతుఁడనుచు
శుక, సనకాదులు ♦ చోద్యంపునరులయ్యు
వసతిఁ గానక భగ ♦ వంతుఁడనుచుఁ
తే.గీ. బరునియెడఁ జేయుచుండ్రు ని ♦ ర్వ్యాజభక్తి
జన్మమునఁ బుట్టి పోనిది ♦ సహజభక్తి ॥ఘన...॥ 25

సీ. ఒకటియె కలదను ♦ నుపనిషద్వాక్యమ్ము
నెమ్మదిగా విని ♦ నమ్మినారు
నమ్మి దాని నను భ ♦ వమ్మునఁ జగములఁ
గల పదార్థములందుఁ ♦ గన్నవారు
కన్నది విన్నది ♦ గాదని నిరసించి
యాధారమగు బ్రహ్మ ♦ మరసినారు
యరసి యన్నిఁటి కిది ♦ యాది, నిత్యము; భేద
మవివేచనన్దోచు ♦ నన్నవారు
తే.గీ. మీరు; మిముబోంట్లు జగముల ♦ మేలుకోఱకు
వ్యవహరింతురు పరమకృ ♦ పాళులగుట ॥ఘన...॥ 26

సీ. శంకారహితుఁడై భ ♦ యంకరనరసింహుఁ
బొగడెఁ బ్రహ్లాదుండు ♦ తెగడె వరము
జానకీరామ ప్ర ♦ సాదమ్ము హారమ్ముఁ
బండ్లతో జిట్లించి ♦ వదలి తీవు
భీష్ముఁడు నిర్యాణ ♦ వేళఁ గృష్ణుం డేమి
వలెనన్న, నీవె ♦ గావలయు ననియెఁ
దనదికాదని సర్వ ♦ మును వదలిన బలి
హరినిత్యదర్శనం ♦ బడిగికొనియె
తే.గీ. స్వార్థపరమార్థములను ♦ యథార్థ మెఱిఁగి
వఱలుదురు బ్రహ్మనిష్ఠు లే ♦ వాంఛఁ గనక ॥ఘన...॥ 27

సీ. మాయాగుణమ్ముల ♦ మలయు భేద మటంచు
నీశ్వరకృపఁ గాంచి ♦ యెఱుఁగు నతఁడు
రూపనామంబుల ♦ సాక్షిగాని మనంబు
తోఁ జరించును భక్తి ♦ తోడుగాఁగ
ప్రారబ్ధదేహ సం ♦ ప్రాప్తంబులకు సాక్షి
గా నుండు భోక్తయుఁ ♦ గర్తగాక
వాని కీశ్వరతత్త్వ ♦ వర్తనమ్మగు భ్రాంతి
గుణకార్యముల నంటు ♦ కొనఁబడండు
తే.గీ. దేవ, రాక్షస, యక్షాది ♦ దేహములను
జెందినట్లుండు నెన్నండుఁ ♦ జెడకయుండు ॥ఘన...॥ 28

సీ. నిందాస్తుతులకు నా ♦ నందించు సత్కవి
'నీదుంప తెగ' యన ♦ నెత్తిఁగొట్టు

అతిశయోక్తులఁ గొని ♦ యాడు విద్వాంసుండు
'బ్రహ్మమీ'వనఁ జెంపఁ ♦ బగులఁగొట్టు
ఉపమానములను నో ♦ రూరఁ జెప్పు గురుండు
'తమరెంతవా'రనఁ ♦ దన్ని తిట్టు
స్వాభావికమునకు ♦ సంతసించు మనీషి
'చావు, పుట్టు'మట ♦ న్నఁ జావఁగొట్టు
తే.గీ. స్వామి! జగమునఁ బండిత ♦ సరణి యిట్టు
లుండెఁ బరమార్థ పదము మ్రా ♦ ప్పుండు గనునె?॥ఘున॥ 29

సీ. తండ్రి, కొడుకుమీఁద ♦ దయలేని గతిఁ జూపి
చూచె శ్రీ నరసింహుఁ ♦ జూడ్కులలర
పుత్త్రుండు దండ్రితో ♦ మూర్ఖతఁ బ్రకటించి
ప్రణుతించె విశ్వ రూ ♦ పంబు సభను
అన్నదమ్ములు కీఁచు ♦ లాడి రామప్రభుఁ
బొడగని కన్నారు ♦ ముక్తి భుక్తి
మేనత్తకొడుకు 'మే ♦ మే' యని శ్రీకృష్ణుఁ
బ్రలపించి యతనిలోఁ ♦ గలసిపోయె
తే.గీ. వారి వారి కర్మఫలాను ♦ సారి భక్తి
యేది గాదందు మిందున ♦ నేది యుక్తి ॥ఘున...॥ 30

సీ. శాస్త్రవాసనచేత ♦ సభను వాదించినఁ
బ్రభువు సన్మానంబుఁ ♦ బడయవచ్చు
దేహవాసనచేతఁ ♦ దివిరి కీర్తిఁ గణింప
నైహికసుఖముల ♦ నందవచ్చు

కర్మవాసనచేతఁ ♦ గ్రతువు లన్నియుఁ జేయ
నాముష్మికఫలంబు ♦ లందవచ్చు
ఆత్మవాసనచేత ♦ వన్ని వాసనలను
గుర్తించి పోఁగొట్టు ♦ కొనఁగవచ్చు
తే.గీ. ప్రజ్ఞ, సర్వమ్ము శ్రీపర ♦ బ్రహ్మమన్న
మున్నుడినిఁ గన్న యర్థంబు ♦ ముక్తి నిచ్చు ॥ఘన... ॥31

సీ. అమ్మ పోలిక లెవ్వ ♦ రడిగినట్లే లేదు
వెదకఁబోయిన కపి ♦ వీరులందు
ఆనవాలిచ్చెనే ♦ గాని రాముఁడు సీకు
నమ్మ రూపముఁ జెప్పి ♦ నట్లు వినము
మఱి, స్వయంప్రభయు, సం ♦ పాతియు సీతోడ
నమ్మవా రిటులుండు ♦ నని యెఱుఁగరు
లంకినియును మెచ్చి ♦ లంకగుట్టెఱిఁగించి
యమ్మగుర్తిదియె పో ♦ మ్మనదు నిన్ను
తే.గీ. అమ్మనెఱుఁగని జనులఁ జ ♦ గమ్ములందు
విందువాస్వామి! పుట్టక ♦ ముందు దప్పు ॥ఘన...॥ 32

సీ. సూక్ష్మరూపముతోడఁ జొచ్చి ♦ లంకను, నలు
వంకల నీ వక ♦ లంక రీతి
నీతి సీతమ్మ స్త్రీ ♦ జాతిఁ గండు నటంచు
వెదకి కానక మది ♦ విసువుగదుర
అంతఃపురిని రావ ♦ ణాంగనలందున
మందోదరినిఁ బట్ట ♦ మహిషిఁ గాంచి

అమ్మగా నెంచి మ ♦ హానందివై భ్రమం
జెంది బుద్ధిని విమ ♦ ర్శించి చూచి
తే.గీ. అమ్మ గాదని, రావణో ♦ ద్యానమందు
రాముసతి సీతఁగన్న నీ ♦ ప్రజ్ఞ యసదె ? ॥ఘన... 33

సీ. 'శ్రీరామ' యనుచును ♦ జింతించుచు నశోక
వని, శింశుపా పాద ♦ పమునఁ గొమ్మ
కురివోసికొని తన ♦ యుసురుఁ బాపుకొనంగ
నంగనల్ నిదుర గ ♦ నంగఁ జూచి
సిద్ధమ్ముగానున్న ♦ సీతమ్మఁ గని రామ
సతి హీనదశఁగాంచి ♦ సంశయించి
ధైర్యమ్ముతో బుద్ధిఁ ♦ దర్కించి యీ యమ్మ
కట్టుపుట్టము, నగ ♦ లట్టిదియుఁ
తే.గీ. జాయయుఁ దెలుంగు చినుఁగులు ♦ జ్ఞప్తిరాఁగ
"అమ్మ ♦ రామ" యనంగ ని ♦ న్నంబ గనియెఁ ॥ఘన॥ 34

సీ. ప్రావరణ జ్ఞాన ♦ వైభవమ్మున దేవి
జానకి గు ర్తింపఁ ♦ జాలినావు
సేవావిధాన ల ♦ క్ష్మీకటాక్షమ్మునఁ
బ్రాణదాత యనంగఁ ♦ బరగినావు
పూర్ణదీక్షాంబా ప్ర ♦ పూర్ణకృపా ప్తిచే
బ్రహ్మకల్పాయువుఁ ♦ బడసినావు
సర్వమాయారూప ♦ శ క్త్యనుగ్రహమున
బ్రహ్మాండములు నిండి ♦ బలిసినావు

తే.గీ. అయ్యా! బ్రహ్మాదులకు ♦ మూలమైన తల్లి
భక్తి భజియించి గాంచితి ♦ శక్తి నీవు ॥ఘన...॥ 35

సీ. ప్రథితచతుర్విధ ♦ ప్రాణిసంతానమ్ముఁ
బదిలమ్ముగాఁగనుం ♦ బ్రకృతితల్లి
కంటి ఱెప్పనుఁబోలి ♦ కలకాల మొకరీతి
రక్షించుచుండును ♦ బ్రకృతితల్లి
కల్పవల్లి యనంగ ♦ కామితార్థములెల్ల
వలసినప్పు డొసంగుఁ ♦ బ్రకృతితల్లి
బ్రహ్మాండములు దొర్లి ♦ పడ్డ బిడ్డలు బాధఁ
బడనీక కాపాడుఁ ♦ బ్రకృతితల్లి
తే.గీ. ప్రకృతియే తల్లి, తల్లియే ♦ ప్రకృతి యనుచుఁ
దల్లిఁ బూజించు భక్తసంతాన ♦ మెప్పుడు ॥ఘన...॥ 36

సీ. మూర్తిత్రయాసక్తి ♦ మూలకారణశక్తి
శ్రీ శారదాంబికా ♦ శ్రీప్రసక్తి
త్రైలోక్యసంప ♦ త్ప్రదాన దీక్షారక్తి
భక్తౌఘరక్షణా ♦ ధ్యాసమునను
ఆదిలక్ష్మియు, మున్ను ♦ వేదవతిగఁ బుట్టి
రావణశక్తి ♦ తిరస్కరించి
సీతామహాదేవి ♦ శ్రీరామపత్నిగా
నయ్యెను; నీవు మ ♦ హానుభావ!
తే.గీ. మూలమైతేఁగిన ఘనపుణ్య ♦ మూర్తి వగుట
నమ్మహాదేవి రూపమ్ము ♦ నరసి కంటిఁ ॥ఘన...॥ 37

సీ. మన కిద్దఱకు నోడం ♦ బడిక యెన్నటికైన
భజియింప నాకుఁ గా ♦ పాడ నీకు
పందె మిద్దఱికిని ♦ భజియింపకునికిఁ గా
పాడకునికి జన్మ ♦ వ్యర్థమగుట
మొగమాటమేల నా ♦ మూర్ఖత్వమును నీదు
సాధుత్వ మిట్లుగాఁ ♦ జాటనగును
ఆశ్చర్యమేమి ? నే ♦ నల్పాత్ముఁడనని మ
హాత్ముండవనుచు ని ♦ న్నాశ్రయింతు
తే.గీ. సందియము లేదు ♦ సచ్చిదానందరూప
సకలజనసమ్మతమ్ము శా ♦ స్త్రమ్ము సుమ్ము ॥ఘన...॥ 38

సీ. బాల్యమంతయు నాట ♦ పాటల గాఁ గాబ
మునఁ బెంచఁ ♦ బడుటచేఁ బోయె నెట్లొ
పదిపదాఱేడు లే ♦ బడిచదువులయందొ
పడిపోయి చెడిపోయెఁ ♦ బరువ మంత
శ్రీసద్గురుస్వామిఁ ♦ జేర నిర్వదియేండ్లు
జ్ఞానశుశ్రూషచేఁ ♦ జనియె నరయ
వార్ధక్యదశ పైకి ♦ వచ్చికూర్చున్నది
యరువదియేండ్ల వ ♦ యస్సు ముందె
తే.గీ. ఇర్వదింటనుఁ జెవు డంధ ♦ మర్వదింటఁ
గంటి నీ కృప నుతియింపఁ ♦ గంటి నిటుల ॥ఘన...॥ 39

సీ. వేదోక్తి బ్రహ్మ ♦ చర్యాదులు విధియని
సలుప నేనాఁడు ద్వి ♦ జత్వ మెట్లు

వేదమ్ము వల్లించి ♦ విడువక స్వాధ్యాయ
పరుఁడ గానైతి వి ♦ ప్రత్వ మెట్లు
బ్రహ్మవాదులఁ జేరి ♦ బ్రహ్మవిజ్ఞానంబు
నంది నే నెఱుఁగ బ్రా ♦ హ్మణ్య మెట్లు
జన్మాదిగానున్న ♦ సంశయ మ్మొక్కింత
యైనఁ బోఁగనను మా ♦ హాత్మ్య మెట్లు
తే.గీ. నేను గందును నీ భక్తి ♦ నిలువకున్న
సాధుజనభక్తమైత్రిని ♦ సలుపకున్న ? ॥ఘన...॥ 40

సీ. సంస్కృతాంధ్రముల భా ♦ షాప్రవీణుఁడ గాను
సముచితపదముల ♦ సన్నుతింప
వ్యాకరణం బెటు ♦ వంటిదో యెఱుఁగను
సాధ్వసాధువు లెంచి ♦ సన్నుతింప
తర్కశాస్త్రము నెప్డు ♦ దర్శింప నేలేదు
సరసయుక్తులు గూర్చి ♦ సన్నుతింప
ధర్మప్రకాశార్థ ♦ ద గ్రంథము లూన్పడ
సమయఫలముఁ జూచి ♦ సన్నుతింప
తే.గీ. చదువ వేదాంతముల్ నిన్ను ♦ సన్నుతింప
సన్నుతింపంగదగునని ♦ సన్నుతింతు ॥ఘన...॥ 41

సీ. వాయునందన! నిన్ను ♦ వర్ణించు వెరవేమి
తండ్రినిఁ బోలి యం ♦ తటను నిలువ
కేసరిసుత! నిన్నుఁ ♦ గీర్తించువిధమేది?
జనకుని మంచివాఁ ♦ డనఁగఁ జేయ

ఈశ్వరాత్మజ ! నిన్నుఁ ♦ శాశ్వతుండన నెట్లు ?
బ్రహ్మాధికారసం ♦ పాది వగుట
పరమాత్మవని నిన్నుఁ ♦ బ్రస్తుతింపఁగ నేల
బహువిధాకృతులతోఁ ♦ బరగుచుండ
తే.గీ. గప్పి ఘలి యను నార్యోక్తి ♦ గలదుగాన
నెట్టులైనను నినుఁ బట్టఁ ♦ బట్టి దలఁతు ॥ఘన...॥ 42

సీ. అబ్ధిఁ దాఁటెడువేళ ♦ నరసి సింహిక నిన్ను
మ్రింగి, యుమిసి గ్రుద్దు ♦ మిటకరించి
శాపంబడఁగిపోవఁ ♦ జావమోదిన మెచ్చి
భయమున లంకిని ♦ వదలె నిన్ను
బ్రహ్మాస్త్రమున నేను ♦ పట్టితినని తండ్రి
యెదుట విడిచె నిన్ను ♦ నింద్రజిత్తు
భాషించి రావణ ♦ ప్రభవు దండ్యుండని
తోఁక జిచ్చిడి పాఱఁ ♦ దోలె నిన్ను
తే.గీ. వెరవెఱుంగని రాక్షసుల్ ♦ విడిచినట్లు
నేను వదలను నీ పాద ♦ మాన నిన్ను ॥ఘన...॥ 43

సీ. ఇంద్రియగోచరం ♦ బే రూపముననైన
నీ రూపమనుచు జీ ♦ ర్ణించుకొందు
ఏ యవస్థనుఁగన్న ♦ నెదియైన నీవని
నిర్భయం బగు నాత్మ ♦ నిలుపుకొందు
బ్రహ్మానుచింతనా ♦ ధ్యాసలబ్ధానంద
మనహంకృతిని నీవె ♦ యనుచుఁ గందు

వాదంబు లుడిగి ని ♦ ర్భేదసంసిద్ధస్వ
రూపనిర్మల సుఖా ♦ రూఢి నుందు
తే.గీ. మోహజలనిధి తరణి నీ ♦ దేహమందు
సచ్చిదానందరూప! వి ♦ శ్రాంతిఁ గనక ॥ఘన...॥ 44

సీ. జన్మ మిమ్మని చేయి ♦ సాచి ని న్నడిగినఁ
దీసివేయంగఁ బ్రా ♦ ర్థింపవలయు
కర్మ విూ తెఱుఁగక ♦ కావించుచుండిన
మాన్పంగ నిను బ్రతి ♦ మాలవలయు
అన్యోన్యహేతువు ♦ లగు జన్మకర్మము
లేది దేనికి ముందొ ♦ యెఱుఁగ రెవరు
శబ్దప్రమాణవి ♦ శ్వాసమ్మువలనఁ
బంధమోక్షములగుఁ ♦ బ్రజల కెపుడు
తే.గీ. జన్మకర్మంబుల రహస్య ♦ చరిత మెఱిఁగి
నరులు కృతకృత్యులగుదు ర ♦ నంగఁదగును ॥ఘన...॥ 45

సీ. రావణశక్తిచేఁ ♦ బ్రాణముల్పోయిన
గతి మూర్ఛనందఱుఁ ♦ గన్న రేయి
"హనుమంతుఁ డొక్కఁడు ♦ హాయిగానుండిన
నందఱుఁ బ్రదుకనుఁ ♦ గందు" రనుచు
జాంబవంతుఁడు విభీ ♦ షణునితో నని, నిన్నుఁ
గని వేడి ద్రోణాద్రి ♦ కనిచె నచట
ఓషధు ల్పొడఁగట్ట ♦ కున్కి గిన్కనుఁ గొండ
దెచ్చి యందఱ లేపఁ ♦ దీయ వారు
తే.గీ. తండ్రివలె నీవు మా ప్రాణ ♦ దాత వనఁగ
నెలమిఁ జెలువవ్వ వెలయు ని ♦ న్నెన్నవలయు ॥ఘన॥ 46

సీ. అంతమై గడువు, స్వ ♦ యంప్రభాగుహ విడి
విన్నవై నీవార ♦ లున్న వేళ
సంపాతిమాటను ♦ జలధిదాటను శక్తిఁ
గనని నీవారలఁ ♦ గన్న వేళ
రామలక్ష్మణులు మై ♦ రావణుచేఁ జిక్కి
రని దిగుల్ నీవారు ♦ గనిన వేళ
లక్ష్మణప్రాణ సం ♦ రక్షణసందేహ
వంతులై నీవారు ♦ ఐనయు వేళ
తే.గీ. నీవు, నీవార లనుమతిఁ ♦ గావనున్న
సుప్రసన్నత నెంతు శ్రీ ♦ ఘు ప్రసన్న ॥ఘన...॥ 47

సీ. సుగ్రీవునానతి ♦ శుభగతి శ్రీరాముఁ
గన నేగుచును గన్న ♦ వినయమూర్తి
అంగదాదులమాట ♦ నబ్ధి దాఁటెడుచోటఁ
బాటించి కన్న ప్ర ♦ భావమూర్తి
లంక నెంతటివారు ♦ శంకింపనట్టులు
శోధింపఁగన్న సు ♦ సూక్ష్మమూర్తి
సర్వమాయారూప ♦ సంపన్న జానకి
విశ్వసింపఁగఁ గన్న ♦ విశ్వమూర్తి
తే.గీ. ముందు రామునిఁగన్న యా ♦ నందమూర్తి
నెన్నుదును నన్నుఁగను నీ ప్ర ♦ సన్నమూర్తి ॥ఘన॥ 48

సీ. నా జన్మమెందుకై ♦ నఁ బనికి వచ్చునా?
వాడుకొనుము హక్కు ♦ వదలుకొందు

నా కర్మ మెట్టిదై ♦ నను సరేయందువా ?
చేయింపు మెప్పుడుఁ ♦ జేయుచుందు
నా పుణ్యపాప మెం ♦ తయొ గణియింతువా ?
మొత్తమ్ము నీకిచ్చి ♦ ముక్తిఁ గందు
నా ధర్మ మిత్తయై ♦ ననుఁ జాలు నందువా ?
సంతృప్తి నినుఁ గనఁ ♦ జాలియుందు
తే.గీ. భారమంతయు నీపైన ♦ వదలినాఁడ
వేఱొకని దైవమని నమ్మి ♦ వేడఁజూడ ॥ఘన...॥ 49

సీ. నీతిరీతినిఁ గాంచి ♦ సీతను మఱచి, నీ
మాటలు రామ ల ♦ క్ష్మణులు వినిరి
రామలక్ష్మణుల వ ♦ ర్ణన నీవు చేయఁగా
దేహమే మఱచి ద్వై ♦ దేహి వినియె
వైదేహిఁ గంటిన ♦ న్వార్త నీవు వచింపఁ
దమపను ల్విడిచి యం ♦ దఱును వినిరి
అందఱు నీమాట ♦ లంది యానందించి
సర్వమ్ము మఱచి వా ♦ స్తవముఁ గనిరి
తే.గీ. వాస్తవ మెఱుంగఁ జాలక ♦ వస్తుబుద్ధి
వస్తువుల మీఁదఁ జేయఁ బ్ర ♦ శస్తమగున ? ॥ఘన॥ 50

సీ. కోఁతిపిల్లనిఁ బట్టు ♦ కొని కొనియాడఁగా
నీతిలేదనుచు నిం ♦ దించువారు
సేవకుండనుచును ♦ దేవుండనుచు వేడఁ
గూడునా యని వాదు ♦ లాడువారు

జరిగిపోయినవి, ని ♦ జమ్మని నమ్మఁగా
లాభ మేమని దెబ్బ ♦ లాడువారు
మానవుండై పుట్టి ♦ మర్యాదఁ జెడఁగొట్టఁ
దప్పౌసుమ్మని మాటఁ ♦ ద్రిప్పువారు
తే.గీ. గలరు, ప్రియులన, హితులను ♦ గాఁ దలంతు
వారినిం గూర్చి నన్నుఁగా ♦ పాడుమయ్య ॥ఘన...॥ 51

సీ. కామితార్థములీయఁ ♦ గల్పవృక్షాదుల
వంటివాఁ డనుచుఁ బో ♦ ల్పంగ నేల ?
కాపాడి రక్షింపఁ ♦ గా వీనితో సాటి
వాఁడు లేఁడని నొక్కి ♦ పలుక నేల ?
కరుణాప్రముఖ గుణ ♦ గణనిధి యని నమ్మి
పదిలమ్ముగా మదిఁ ♦ బాత నేల ?
మోక్షార్థ మొచటికిఁ ♦ బోనఁగాఁ బనిలేదు
తానయై యిడునన్న ♦ ధైర్య మేల ?
తే.గీ. ఇంత శ్రమయేల ? శ్రీహను ♦ మంతుఁడ యన
గంతునైతువు నాజన్మ ♦ మంతుఁ గనఁగ ॥ఘన...॥ 52

సీ. కామధేనువు పసి, ♦ కల్పక మొకచెట్టు
చింతామణియు రాయి ♦ చెప్ప నుపమ
సాటిలేరని నొక్కఁ ♦ జాలఁ జిక్కులువచ్చు
హెచ్చుతగ్గులు సెప్ప ♦ నిచ్చమెచ్చ
నైజలక్షణము లే ♦ నాఁటికిం జెడిపోవు
కలుగ నిల్పునఁ బాత ♦ నిలువఁబోవు

ఉన్నదానికి ధైర్య ♦ ముండఁగా బనిలేదు
లేనిదానికి ధైర్య ♦ మూనరాదు
తే.గీ. కాన, నిను నిట్టులట్టనఁ ♦ గాన వెరవు
మఱపు నెఱుఁగని యెఱుక నే ♦ మఱవు నీవు ॥ఘన॥ 53

సీ. వ్యవహారసిద్ధి గా ♦ వలెనన్న దృష్టితో
నుపమించి, వినుతుల ♦ నొప్పినారు
ఒకఁడైనఁ దన కుప ♦ యోగించు విధి బుద్ధి
సాటి లేరని స్తుతు ♦ ల్సలిపినారు
గుణవిశేషంబులఁ ♦ గొనియాడు తలఁపుతో
సద్గుణనిధి యనఁ ♦ జాలినారు
మోక్షమేనని మోస ♦ పోకుండ నమ్మఁగా
ధృతిమతి నతని బో ♦ ధించినారు
తే.గీ. బ్రహ్మవాదులు, నినుఁ భగ ♦ వంతుఁ బ్రజ్ఞ
శ్రుతులగలనీతిఁ దగురీతి ♦ శ్రోత లలర ॥ఘన...॥ 54

సీ. "శ్రోతృహితైషిణీ ♦ శ్రుతిగాత్మమాతృవ
ల్లాలయతి" యనువా ♦ క్యాలు వినియు
తల్లి వేత్వేఱుగాఁ ♦ దన బిడ్డలకుఁ బెట్టి
పెంపఁగా వారు సు ♦ ఖింపఁ గనియు
ఆహారనిద్రాభ ♦ యాదులు పశుపక్షి
మానవజాతి సా ♦ మాన్య మనియు
తిర్యక్కులను మించి ♦ తెలివి తేటలు గాంచి
మంచికై నరుఁడు జ ♦ న్మించెననియు

తే.గీ. వేదమార్గమ్ము విడిచి వి ♦ వేక మెడలి
దేహసుఖవృద్ధికై జనుల్ ♦ దిరుగనగునె ? ॥ఘన...॥ 55

సీ. తనదుపుట్టువుగుట్టుఁ ♦ దల్లిచెప్పినఁగాక
తన తెల్విఁగన్నట్టి ♦ ఘనుఁడు గలఁడె ?
తనతండ్రి నెఱుఁగని ♦ జనుఁడు గల్గునుగాక
జనని గ్రాలను ♦ జనుఁడు గలఁడె ?
ప్రకృతిస్వభావ సం ♦ భవ వివేకజ్ఞాన
పదవి, ఎదలు నర ♦ పశువు గలఁడె?
సర్వలోకానంద ♦ సంతాన సంపత్తి
మనుజునిది యనఁ గా ♦ దనఁగఁ గలఁడె ?
తే.గీ. స్వామి ! రుజువేల దీనికి ♦ స్వానుభవముఁ
గాదనగలండె మూర్ఖుండు ♦ గానివాఁడు ॥ఘన...॥ 56

సీ. అపవాదమున సీత ♦ యడవి కంపంబడి
కొడుకు లిద్దఱఁ గనెఁ ♦ గుశలవులను
పేరిడి వాల్మీకి ♦ పెంచి వారలఁ జది
వించె రామకథ ర ♦ చించి వేడ్క
వారు క్రమంబుగా ♦ శ్రీరామసభయందు
గానంబుఁజేయఁగాఁ ♦ గనినవారు
తలిదండ్రు లెవరన్నఁ ♦ దల్లిసీతమయని
తండ్రి నెఱుఁగమన్న ♦ దల్లి వచ్చి
తే.గీ. శపథమొనరించి రాముండు ♦ జనకుఁడనుచుఁ
జెప్పె; నప్పుడు లోకము ♦ లొప్పెగాదె ? ॥ఘన...॥ 57

సీ. శ్రీరామవిభుఁడును ♦ సీతాసతిని వేద
వతియని యెఱిఁగిన ♦ వాఁడుఁగాఁడె ?
రామాయణగ్రంథ ♦ రచయిత యెఱుఁగడే ?
కుశలవుల్ రాముని ♦ కొడుకులనుచు
శాంతాదికాంతలు ♦ చాయపోలికలచేఁ
జిన్నిరాములనుచు ♦ నెన్నలేదె ?
గర్భిణి న్వదినెనుఁ ♦ గాన డించినమాట
మఱచువాఁడగునె ? ల ♦ క్ష్మణుఁడు మఱది
తే.గీ. ఏమిగోప్యమొ ? తండ్రిని ♦ నెఱుఁగమన్నఁ
జెప్పరొక్కరుఁ దమతల్లి ♦ చెప్పువఱకు ॥ఘన...॥ 58

సీ. తగ వెఱింగిన బ్రహ్మ ♦ తారమాటనుబట్టి
బుధునిఁ జంద్రునకిచ్చి ♦ పోయినాఁడు
కర్మఁజేయఁగఁబూను ♦ ధర్మజుండును మున్ను
కుంతిచెప్పినఁ గర్ణుఁ ♦ గూర్చిచేసె
రాజసూయాశ్వమ్ము ♦ రాము డంపఁగఁ బట్టు
తనయుల మాన్చె సీ ♦ తమ్మచెప్పి
వ్యాసుని జన్మర ♦ హస్యమ్ము జగమునఁ
బ్రకటించినది సత్య ♦ వతియతల్లి
తే.గీ. తల్లిచెప్పక బిడ్డలు ♦ దండ్రి నెఱుఁగఁ
నట్టె నిముఁగన, శ్రుతి విన ♦ నట్టి జనులు ॥ఘన...॥ 59

సీ. జంతుసంతతి నర ♦ జన్మమందితి, నందు
బురుషుండ, భారత ♦ భూమియందుఁ

బూర్వజన్మాభ్యాస ♦ మున విప్రతనుఁ గంటి
స్నానసంధ్యాద్యను ♦ ష్ఠాన మబ్బె
శ్రీ సద్గురుస్వామి ♦ సేవామహాభాగ్య
మున నింతవిద్వత్త్వ ♦ మును లభించె
సద్గోష్ఠి, సజ్జన ♦ సాంగత్య బలమున
విద్యుక్తమాత్మ వి ♦ వేక మమరె
తే.గీ. నిన్ను సర్వాత్ముఁగాఁ గని ♦ సన్నుతింతు
బంధముక్తుఁడనై యుండుఁ ♦ బరమపురుష ! ॥ఘన...॥ 60

సీ. శ్రీ మన్మహాదేవ ! శ్రితజనావనభావ
భావస్వరూప ! దీ ♦ వ్యత్ప్రభావ !
భావనామాత్ర సం ♦ వారితాఖిలదోష !
దోషాచరానిలా ♦ ద్భుతభుజంగ !!
జంగమస్థావర ♦ చయనియమోద్యోగ !
యోగసాంఖ్యాధ్యాత్మ ♦ యోగవిభవ !
భవభయసంశయ ♦ ప్రముఖవారణహరి !
హరి విరించిముఖామ ♦ రార్చితపద !
తే.గీ. పదయుగవిశేష విన్యాస ! ♦ భవ్యవాస !
వాసనారూపమాయా వి ♦ లాసలాస్య ! ॥ఘన...॥ 61

సీ. శ్రీరామపదభక్తి ♦ సేవకావనరక్తి
దేవకార్యాసక్తి ♦ ధీప్రసక్తి
దుమశిక్షణశక్తి ♦ శిష్టరక్షణయుక్తి
ఘనసుధీసంసక్తి ♦ ఖలవిముక్తి

శ్రుతిసంపదనురక్తి ♦ శుభయోగసుఖభుక్తి
మాహాత్మ్యగుణాసక్తి ♦ మంజులోక్తి
పరమపూరుషసూక్తి ♦ దురభిమానవిరక్తి
స్వస్వరూపావాజ్ఞాన ♦ బంధముక్తిఁ
తే.గీ. నైజలక్షణములు నీక ♦ నంతవిభవ!
భవజలధి దాఁట నావ, నీ ♦ పాదసేవ ॥ఘన...॥ 62

సీ. శ్రీమద్ధనూమతే ♦ సిద్ధసద్గుణవతే
ప్రథితభక్తాయ తు ♦ భ్యం నమోఽస్తు
భగవతే, బలవతే ♦ బహుశాస్త్రధనవతే
పవనపుత్రాయ తు ♦ భ్యం నమోఽస్తు
ఆయుష్మతే, భవి ♦ ష్యద్బ్రహ్మమూర్తయే
బ్రహ్మవ్రతాయ తు ♦ భ్యం నమోఽస్తు
పరమపవిత్రాయ ♦ భవ్యచరిత్రాయ
భక్తేష్టదాయ తు ♦ భ్యం నమోఽస్తు
తే.గీ. భవభయనివారణాయ తు ♦ భ్యం నమోఽస్తు
బ్రహ్మవాదిహితాయ తు ♦ భ్యం నమోఽస్తు ॥ఘన॥ 63

సీ. ఆర్యైశ్వరామోఘ ♦ వీర్యప్రభూతాంగ
శౌర్యసౌందర్య వి ♦ స్తారధైర్య
శ్రీరామజానకీ ♦ క్షేమవార్తారత్న
ధారణోజ్జ్వలయోగ ♦ ధారణాంగ
రావణసదృశ మై ♦ రావణ ప్రాణ సం
భృతమహాద్భుతబల ♦ భృంగభంగ

అనుపమాశ్చర్య క్రి • యాప్రసాధితసర్వ
భక్తమనోభీష్ట • ఫలవిశేష
తే.గీ. అంజనాకేసరిసుపుణ్య • పుంజమూర్తి
ఇందుచందనకీర్తి! యా • నందమూర్తి ॥ఘన...॥ 64

సీ. దేశకాలముల గు • ర్తించి చేయఁగనగు
బ్రజకు క్షేమము • పరిపాలనమ్ము
ఎటులైన, నెప్పుడైన • నేకరీతిగ నీతిఁ
గననైన బుద్ధి సు • ఖం బొసంగు
సదుపాయములఁ గార్య • సఫలతఁ గనవచ్చు
బరులతోడ విచార • పడని నడత
వ్యసనములనఁబోక • వర్తించు నరుఁ డెప్డు
చెడఁ డెట్టి కష్టము • లొందఁబోఁడు
తే.గీ. అనఁగ విని ధర్మమార్గమ్ము • నరయు జనము
జగము సత్యమ్ముగా; నీ ని • జమ్ముఁ గనునె? ॥ఘన॥ 65

సీ. ఏకముఖమున న • నేకముఖుఁడవగు
నినుఁ బంచముఖుఁడన • ఘనత యేమి?
తలలతోఁ గాలుసే • తులు గల్గుచుండఁగా
నిను దశభుజుఁడను • నియమ మేమి?
సకలభూతాధార • సత్వసంపన్ను నిన్
వనచరశ్రేష్ఠుండ • వనుట యేమి?
పంచభూతములకుఁ • బ్రాణాత్మ నిను జగ
త్ప్రాణనందనుఁడను • వరుస యేమి?

తే.గీ. తోఁచితోఁచక యిట్టు లం ♦ దురు మహాత్మ
ఊకొనుదు వీవు కాదన ♦ వొకటియైన ॥ఘన...॥ 66

సీ. సభను రావణుతోడ ♦ సంభాషణముఁజేయఁ
బెరుగ నీ వెక్కిన ♦ పెద్దగద్దె
చీఁకటిలంకలో ♦ వాకిటఁగల పేరు
చెప్పి ముట్టించిన ♦ చేతిదివిటి
దూరంబనక వాజి ♦ దూటి దోషాత్ముల
యసువులఁ దీయు మ ♦ హాయుధమ్ము
కాలుసేతులు నంతు ♦ గా నెంతపనికైన
నలయని బలమైన ♦ యవయవమ్ము
తే.గీ. సకలసమయసమంచిత ♦ సాధనమ్ము
సుమ్ము వాలమ్ము పెట్టని ♦ సొమ్ము నీకు ॥ఘన...॥ 67

సీ. తట్టైనా నీ తోఁక ♦ దయ్యాలు భూతాలు
గాలిధూళులతోడఁ ♦ గలసిపోవు
పట్టైనా నీ తోఁక ♦ బలవంతులగువారి
ప్రాణాలు యమలోక ♦ పదవిఁ జెందు
చుట్టైనా నీ తోఁక ♦ గట్టు నట్టె పెకల్చి
గుండ్రాయిగా దొర్లు ♦ కొనఁగఁజేయు
నెట్టైనా నీ తోఁక ♦ నింగి నెవ్వాలకైన
జలజలరాలు చు ♦ క్కలు ధరిత్రి
తే.గీ. చావు బ్రదుకులు నీ తోఁకఁ ♦ జూచ ముడువఁ
గనును జగములు నీ యను ♦ గ్రహము కలిమి ॥ఘన॥ 68

సీ. సీతమ్మకై యొక్క ♦ చెట్టు నిల్పి యశోక
వనమంతయునుఁ బీకి ♦ వైచెఁ దోఁక
అంతఁబోక విభీష ♦ ణాలయమ్ము మిగిల్చి
పీఁక లంకనుఁ గాల్చి ♦ వేసెఁ దోఁక
రామలక్ష్మణుల వి ♦ శ్రాంతికై రణభూమి
వెలసిన కోటయై ♦ నిలిచెఁ దోఁక
శతకంఠరావణా ♦ శ్రమమున శ్రమఁ జొచ్చి
చచ్చినాఁ డనిపించి ♦ వచ్చెఁ దోఁక
తే.గీ. గరుడభీముల నవమాన ♦ పఱచెఁ దోఁక
తోఁకఁ గొనియాడఁగలన ♦ నీ తోఁడులేక ॥ఘన...॥ 69

సీ. యమకాలపాశంబు ♦ వ్యర్థమయ్యె మృకండుఁ
సుతునిఁ బ్రోచిన ♦ శివశూలమునను
శివశూల మనిరుద్ధు ♦ శిక్షింప నెనుదీసె
రణమందు విష్ణుచ ♦ క్రంబుఁ జూచి
విష్ణుచక్రము దీను ♦ విడిచె దుర్వాసుని
దయ నంబరీష భ ♦ క్తార్తిఁ గాంచి
భక్తార్తి నీపాలఁ ♦ బడ నడ్డిసెడ నీవు
వాల మాడింతు కృ ♦ పాలవాల
తే.గీ. వాల మెన్నని భయమున ♦ వదలె దవని
మేలు! వాలమె లోకాల ♦ నేలఁజాలు ॥ఘన...॥ 70

సీ. స్వామి! నీ సర్వాంగ ♦ సౌందర్యలక్షణ
వర్ణనఁజేయ నా ♦ వలన నగున?

ముక్కు మొగంబుల ♦ చక్కందనమ్మును
　　　నుదురు శిరంబుల ♦ కుదిరికయును
చెవుల కన్నుల సొంపు ♦ చెక్కిళ్ళఁ బెదవులఁ
　　　గాళ్ళఁజేతుల బొజ్జఁ ♦ గలుగు సొగసు
నెట్టయెదుట నిల్చి ♦ యే నిన్నుఁ గనలేక
　　　వెనుకతోఁకనుఁబట్టి ♦ వ్రేలినాఁడ
తే.గీ. వాలుఁజూపుల నీ కృప ♦ జాలువారఁ
　　　గందు నందము నుందు ను ♦ ఖంబులందు ॥ఘన॥ 71

సీ. శ్రీ ప్రసన్నముఖంబు ♦ శ్రీదంబు శ్రేయంబు
　　　చెలువంబు, డంబు ఖిం ♦ చిన విధంబు
వానరాస్యము, శ్రీ శి ♦ వారహాస్యము, సుప్ర
　　　శస్యము, శ్రీరామ ♦ చంద్రశంస్య
మశ్వాననము, పూజ్య ♦ విశ్వావనము విష్ణు
　　　నిశ్వాసమునఁ గను ♦ నిగమవనము
గారుడవక్త్రమ్ము ♦ కమనీయ ఫలదమ్ము
　　　సులభమ్ము సుస్మిత ♦ శోభితమ్ము
తే.గీ. క్రోడనరసింహాలపనముల్ ♦ గోప్యమంత్ర
　　　తంత్రనిలయమ్ము లెన్నఁగాఁ ♦ దరమ? పరమ ! ॥ఘన॥ 72

సీ. ముదములేని ప్రపంచ ♦ మును జూడఁ ద్రిప్పిన
　　　మూరితిశంకర నైజ ♦ భూషయగును
వానరాది విశేష ♦ వక్త్రముల్ దాల్చుట
　　　సకలరూపుడవన్న ♦ జాడయగును

కాళ్ళఁ జేతులఁ బోవఁ ♦ గాఁ బట్టఁబట్టఁగా
సమకాలచేష్టా ప్ర ♦ చారమగును
విదలించి వాలమ్ము ♦ విడుచుట ముడుచుట
స్వాధీనమాయా ప్ర ♦ స క్తియగును
తే.గీ. గాక, వేత్తైన నెవరైనఁ ♦ గానఁగలరె?
నిన్ను; నీదుమాహాత్మ్యంబు ♦ నెన్నఁగలరె? ॥ఘన॥ 73

సీ. శ్రీవసిష్ఠమహర్షి ♦ శిష్యుండు రాముండు
రామునిశిష్య వ ♦ రప్రసిద్ధి
హనుమంతునకు నీకు ♦ నమరిన విధమున
ననుఁబోంట్ల కబ్బిన ♦ నాఁ డతండు
గురుసూక్తి నినుఁగూర్చి ♦ కొనియాడు బ్రహ్మము
సర్వమ్ము నీవని ♦ సంతతమ్ము
సచ్చిదానందమ్ము ♦ సమరసభావమ్ము
జననమ్ము సఫలమ్ముఁ ♦ గనఁగ నమ్ము
తే.గీ. సత్య మోదేవ! శ్రీరామ ♦ నిత్యసేవ
నన్నియునుఁగన్న నీకన్నఁ ♦ జిన్న నేను ॥ఘన॥ 74

సీ. ఉన్నవాస్తవమును ♦ నూహించి కనలేక
లేనిపోనివి యెంచి ♦ లీలలనుచు
సిద్ధపదార్థంబుఁ ♦ బుద్ధి గైకొనలేక
వచ్చిపోయెడువాని ♦ మెచ్చుకొనుచు
స్వానందభావైక ♦ సంతృప్తి మనలేక
యిహాపరంబుల స్మరి ♦ యించుకొనుచు

అపరోక్షసౌఖ్యంబు ♦ ననుభవింపఁగలేక
కలకాల మెందుకో ♦ కష్టపడుచు
తే.గీ. గడపుఁ గాలంబు, నినుఁ దృటి ♦ కాల మెఱిఁగి
మఱఁగి తిరుగఁడు నరుఁడు వా ♦ నరుఁడుగాని ॥ఘన॥ 75

సీ. భయభక్తులున్నట్టి ♦ భాగ్యవంతుఁడగాను
వైరాగ్యవిభవమ్ముఁ ♦ బడయ నెందు
దానధర్మాది వి ♦ తరణలక్ష్మి నెఱుంగ
నుపరతిశ్రీ గని ♦ యుండలేదు
దయయు దాక్షిణ్యమ ♦ న్ధనము నిల్వ దోకింత
శోధనైశ్వర్యమ్ముఁ ♦ బొసఁగఁబోదు
శ్రద్ధాసమాధాన ♦ సంపత్తి యసుదయ్యె
బ్రహ్మనిష్ఠానిధి ♦ ప్రాప్తిఁగనను
తే.గీ. రిక్తుఁడను; పుట్టుసిరిని నా ♦ సక్తిలేదు
లేమి నెఱిఁగిన కలిమి నే ♦ నేమి గందు ॥ఘన॥ 76

సీ. పుణ్యపాపములని ♦ పోనరింప నెన్నండు
సుఖదుఃఖముల జూడఁ ♦ జూడఁబోను
మంచిచెడ్డల మాట ♦ లెంచి నిల్వాయెనర్ప
హానివృద్ధులకు నా ♦ యాసపడను
మానావమాన సం ♦ భవయత్నము స్త్రీయఁ
గీర్త్యపకీర్తుల ♦ గేలి వినను
శత్రుమిత్రవిచార ♦ సంగతి నొల్లను
ద్వేషరాగముల గు ♦ ర్తించి కనను

తే.గీ. నేను నీ వన్న మాటల ♦ నిజముదప్ప
నితర మెఱుఁగను, జన్మము ♦ లేల? స్వామి! ॥ఘన॥ 77

సీ. కాలుసేతుల నంటఁ ♦ గట్టి వైచిననైన
వ్రేలైన సందున ♦ వెళ్ళఁబెట్టు
నోట గష్టనఁ గొట్టి ♦ మాట నాపిననైన
గొంతులోఁ గాండ్రించి ♦ గుటక వెట్టు
ముక్కుఁ గుత్తుకఁ బట్టి ♦ మూసి యొత్తిననైన
డొక్క లెగురవైచి ♦ డొల్ల నెట్టొ
ఊపిరిబిగఁబట్టి ♦ యున్నంతలోనైనఁ
గ్రిందుమీఁదికి గ్రుడ్లు ♦ ద్రిప్పు నట్టి
తే.గీ. ప్రాణులకు నైజమిద్ది; యా ♦ ప్రాణ మెడల
నొడలు గదలక పడి చెడు ♦ నో మహాత్మ! ॥ఘన॥ 78

సీ. దేహమ్ము చెడినను ♦ మోహమ్ము చెడకున్న
రకరకంబుల శరీ ♦ రములు గలుగు
భరతాదులంతటి ♦ వారు మోహముగన్న
మృగశరీరాదుల ♦ మెలఁగి రగుట
మోహవారిధిఁ దాఁట ♦ మునిఁగిపోవనినావ
మానవ దేహంబు ♦ మరల గాదు
పడవ నీటిని లోనఁ ♦ బడయకుండినయట్లు
లెందు మోహము లోనఁ ♦ జెందనీక
తే.గీ. సందులకుఁ దారుఁ బూసెదు ♦ చందమునను
సందువోకుండ నీ సేవ ♦ సలుపుచుందు ॥ఘన...॥ 79

సీ. దేహమే నే నన్న ♦ దే మహామోహంబు
నా దేహ మిది వేఱ ♦ నంగ వినుచు
బుత్త్రిఁడే నేనన్న ♦ బుద్ధి వ్యామోహంబు
రెండు దేహములతో ♦ నుండఁ గనుచు
భార్యాది దేహసం ♦ బంధంబు మోహంబు
వచ్చిపోయెడు ప్రవా ♦ హంఘులనుచు
బహువిధవస్తు సం ♦ పాదన మోహమా
క్షణ మొక్కటియు నిల్వ ♦ జాలదనుచు
తే.గీ. మోహ మా బ్రహ్మపుట్టినే ♦ ముంచు; నాది
ముంచదా ? నీపయిభార ♦ ముంచకున్న ॥ఘన...॥ ౩౦

సీ. ప్రకృతి, రసాయన ♦ ప్రముఖ శాస్త్రజ్ఞులు
పడయు విద్యుచ్ఛక్తి ♦ వలన నెపుడు
ప్రాపంచికసుఖమ్ము ♦ బహువిధమ్ములఁ గన్పఁ
గన్నుల నా శక్తిఁ ♦ గననియట్లు
భౌతికశక్తిఁ, స్వ ♦ భావశాస్త్రజ్ఞులు
కార్యంబుననుఁ గంద్రు ♦ కనులఁ గనరు
శక్తిఁ గన్నులఁ జూప ♦ జాలని శాస్త్రమ్ము
విడిచి యేశక్తినిఁ ♦ బడయ రెవరుఁ
తే.గీ. గాన; నీ శక్తిఁ గన్నులఁ ♦ గాననగునె ?
కార్యమునఁగాక ? శాస్త్రమ్ము ♦ గాని దగునె ? ॥ఘన॥ ౩౧

సీ. శాస్త్రమే లేదని ♦ చప్పట్లు గొట్టుట
కైనఁ గావలె శక్తి ♦ యంతో యింతో !

"అది యిట్లు సాధ్యమా" ♦ నని నొక్కి చెప్పును
          శాస్త్రమ్ము; వక్త శా ♦ స్త్రజ్ఞుఁడగును
తనశక్తిఁ దాఁ జేయు ♦ పనులచేఁ గనఁజేయుఁ
          గనఁ డెవ్వఁడును దానిఁ ♦ గనులతోడ
శక్తిమంతుండను ♦ శక్తి నే గానను
          బ్రతివాఁ డెఱుఁగు నిల్వఁ ♦ బడఁడు ధృతిని
తే.గీ. ఇదియె మోహము, తాదాత్మ్య ♦ మిదియ స్వామి!
దీనిఁ జొరనీకు నీవు నా ♦ లోన నిల్చి ॥ఘన...॥ ౯

సీ. కాలిన బొబ్బనుఁ ♦ గని కాల్చుటకు శక్తి
          గల యగ్నివే ఱనఁ ♦ గలిగినట్లు
కార్యమ్ముచే శక్తి ♦ గలదని యా శక్తి
          పరుఁ డీశ్వరుం డన ♦ వలయుఁ దెలిసి
ప్రతివస్తువును శక్తి ♦ భరితమే యగుటచే
          సర్వ మీశ్వర విలా ♦ సమ్మె యగును
తనుల కీశ్వరుఁ డెప్పు ♦ గానరాఁడను నుడి
          పై మాట లెఱుఁగని ♦ వారల నుడి
తే.గీ. స్వామి! నీ శక్తిఁ గని, నీవ ♦ సర్వమన్న
శ్రుతిశిరోభూషణము శిర ♦ స్సున ధరింతు ॥ఘన...॥ ౪

సీ. శ్రుతులు భిన్నంబులు ♦ స్మృతులు మహర్షుల
          మతులు భిన్నము లేక ♦ గతినిఁ జనవు
సాధింప నాయువు ♦ చాల దనంతముల్
          వేద్యంబు బహుళంబు ♦ విఘ్నయుతము

"శతమితిశత"మను ♦ శ్రుతి మితాయువునందు
నేఁబది నిద్రయం ♦ దే గతించు
బాల్యవార్ధక్యము ♦ ల్పాతిక గాను నిల్వ
పాతికను బ్రదుకు ♦ బయటఁబడును
తే.గీ. గాన, జగములుఁగల నిన్నుఁ ♦ గని సుఖింతు
నంబుమిశ్రపయఃపాయి ♦ హంసపగిది ॥ఘన...॥ 84

సీ. కాల్పుశక్తిని మాన్పఁ ♦ గల యోషధింబలె
భక్తి యీశ్వరశక్తి ♦ బలముఁ జెఱుపఁ
మాయామయజగము ♦ మాత్ర ముపేక్షించి
భగవన్మయము స ♦ ర్వమ్ముఁ గనుట
శ్రీరామదేవుండు ♦ సీతామహాదేవి
యుక్తితో, నుపనిష ♦ దుక్తి తోడ
సద్వివేకపుబుద్ధి ♦ శాలికి నీ కిడ
ధన్యుండవైతి వ ♦ ద్వైతసిద్ధి
తే.గీ. స్వామి! శ్రీరామసద్గురు ♦ చరణసేవ
గన్న నిను నేను సద్భక్తి ♦ సన్నుతింతు ॥ఘన...॥ 85

సీ. దేహముఁగనుచు, దా ♦ సోఽహమందును నీకుఁ
జేతనాంశుఁడనౌదు ♦ జీవగతిని
ఆత్మ నేననుభావ ♦ నారూఢమతినైన
వేళ నీవేనను ♦ భేద మెఱుఁగ
బరమాత్మయం దీ ప్ర ♦ పంచ మధ్యాసచేఁ
గలయట్లు దోఁచును ♦ గాదు నిజము

త్రికరణశుద్ధిగా ♦ దేవస్వరూపమ్ము
సచ్చిదానందమ్ము ♦ సన్నుతింతు
తే.గీ. ఎన్ని జన్మములైన నా ♦ కేమిభయము ?
నిన్ను వీడనాడఁజూడ నే ♦ నున్నవఱకు ॥ఘన...॥ 86

సీ॥ శ్రీహరి దాల్చిన ♦ దేహవేషమ్ము ల
నంతావతారా ల ♦ నంగనయ్యెఁ
శివుఁ డెన్నఁడైన వే ♦ సిన వేసము ల్గూడ
శివలీలలుగ నొప్పఁ ♦ జెప్పఁబడియె
బ్రహ్మ వేషము మార్చ ♦ వలసిన పనిలేక
పోయెఁ గాఁబోలు నీ ♦ పూటవఱకు
ఇంద్రచంద్రాదుల ♦ కెన్ని వికారంపు
దేహముల్ గలిగెనో ♦ తెలియనగునె
తే. గీ. బ్రహ్మ మొదలుగాఁ జలిచీమ ♦ వఱకుఁ గలుగు
దేహములు వేషములుగావె ♦ దేవదేవ ॥ఘన...॥ 87

సీ. అతిబాల్యమగును శ్రీ ♦ యాంజనేయమ్ము ప్రి
సన్నాంజనేయమ్ము ♦ సంతసమ్ము
వీరాంజనేయమ్ము ♦ విజయరూపమ్ము ప్ర
పత్త్యాంజనేయమ్ము ♦ భక్తిసుమ్ము
ధైర్యవిగ్రహము, ప్ర ♦ తాపాంజనేయమ్ము
భద్రాంజనేయమ్ము ♦ ప్రాభవమ్ము
అభయమ్ము పంచము ♦ ఖాంజనేయమ్ము, శ్రీ
విశ్వాంజనేయమ్ము ♦ విశ్వదమ్ము

తే.గీ. దేవ! నీవు వివిధదేహ ♦ భావములను
నిల్వఁబడి, పిల్వఁబడి సదా ♦ గొల్వఁబడుదు ॥ఘన...॥ 88

సీ. తిలకించితిని నిన్నుఁ ♦ బలికించితివి నన్నుఁ
బులురకంబుల మేను ♦ బులకరింపఁ
గంటిని నీ కృప ♦ వింటివి నా కృతిఁ
దొంటివు న్నొంబంటి ♦ వెంటనడువ
బ్రహ్మపదవి నీకు ♦ బ్రహ్మపదము నాకు
గలిగింపఁ దనువులు ♦ గలిగి నిలిచె
ముందు వెనుకఁ జూచు ♦ చుందువు నీ వెప్డు
ముందు వెనుకఁ దోఁచ ♦ కుందు నేను
తే.గీ. సందియము లేదు జన్మము ♦ సఫలమగును
సఫలజన్ముని నిన్ను నే ♦ సన్నుతింతు ॥ఘన...॥ 89

సీ. ఆయురారోగ్యాదు ♦ లడుగ నేరను నిన్ను
సన్నిధానము నంది ♦ యున్నకతన
ఇంద్రియమ్ముల బల ♦ మిమ్మని నిను వేడ
విషయసుఖము పశు ♦ వితతిఁ గలదు
కామాదులను ద్రుంపఁ ♦ గా నిన్ను శ్రమపెట్ట
మరలఁ జిగుర్చును ♦ మాయవలన
జ్ఞానవైరాగ్యాది ♦ సంపత్తి నినుఁ గోర
బరభాగ్యజీవనా ♦ భ్యాసమగును
తే.గీ. ఉన్నయంతన సంతృప్తి ♦ నున్న నిన్ను
సన్నుతింతును నీవున్నఁ ♦ జాలు నాకు ॥ఘన...॥ 90

సీ. తాతదండ్రుల నన్న ♦ దమ్ముల గురువులఁ
జంపఁ భీతిలు సవ్య ♦ సాచిఁ జూచి
శ్రీకృష్ణుఁ డేవిధిఁ ♦ జెప్పి చేయించెనో
వినియుందు వతని కే ♦ తనమునందు
వాలిఁ జంపిన రాముఁ ♦ దూలనాడ నతండు
తార నేగతిని నో ♦ దార్చె వినవె ?
శత్రుఁడేయగు విభీ ♦ షణ నిషేధము నెట్లు
తోలఁగించితివి రాము ♦ తోడఁ గలసి
తే.గీ. స్వామి ! సర్వాత్మవగు నీవు ♦ స్వపర భేద
విధినిషేధవిధానముల్ ♦ విని యెఱుఁగవె ॥ఘన. . .॥ 91

సీ. శ్రీ పరాశర సంహి ♦ తా పాఠముల నిన్ను
గొప్ప గృహస్థుగాఁ ♦ జెప్పినారు
కళ్యాణమును లోక ♦ కళ్యాణమున కని
చక్కగాఁ వర్ణన ♦ సలిపినారు
సకలలోకానంద ♦ సంధాయివగు నిన్నుఁ
బరిణయంబయ్యె సు ♦ వర్చలయును
కదళీవనాదులఁ ♦ గాలంబుఁ గడపిన
పరసుఖానంద దం ♦ పతుల మిమ్ము
తే.గీ. శ్రేయములు కోరు నను(బోంట్లు ♦ శ్రీ సువర్చ
లాంజనేయ మహాత్మ ! ' జే ' యని నుతింత్రు ॥ఘన॥ 92

సీ. స్వామి ! నీ కళ్యాణ ♦ చరితమ్ము విన్నంత
వఱకు నా ముఖమునఁ ♦ బలుకనిమ్ము

బ్రహ్మచర్యాశ్రమ ♦ వ్రతపూర్తి నీకుఁ గా
వచ్చుచున్నంతలో ♦ వారు వీరు
నిను గృహస్థునిఁ జేయుఁ ♦ డని తల్లిదండ్రుల
తో నన మాకేమి ♦ దోఁచదనిరి
వాయుదేవుఁడు పిల్ల ♦ వాని యిష్టమ్మనెఁ
బార్వతీశ్వరు లేమి ♦ పలుకరైరి
తే.గీ. బ్రహ్మచారివి, పెండ్లిగా ♦ వలయు ననవు
లోకములపై నఁబడె శుభా ♦ లోచనమ్ము ॥ఘన...॥ 93

సీ. పతితీక్ష్ణతను సహిం ♦ పఁగఁజాలనని యన్న
ఛాయతండ్రి, రవిని ♦ సానఁబట్టెఁ
రాలినపొడిముద్ద ♦ రాలయి నిల్చినఁ
దపనుండు పెంచెను ♦ దనయఁ గూర్మి
అన్వర్థసంజ్ఞగా ♦ ననిరి సువర్చల
యని కన్నవా రాత్మ ♦ నలరి కన్నె
నిరుపమానాంగి య ♦ నిర్వాచ్య సామర్థ్య
మున నొప్పఁ గనుచుండె ♦ దినదినంబు
తే.గీ. పెండ్లియీడైనగారాబు ♦ పిల్లఁ జూచి
బహువిధంబుల నాడిరి ♦ ప్రజలు జగతి ॥ఘన...॥ 94

సీ. "ఈ బాల నెవ్వని ♦ కియ్యఁబోయినఁ గన్న
తల్లి నేననుచు నే ♦ తల్లి యనును
తండ్రిఁ జూడఁగ లోక ♦ తపనుండుగా, నెవ్వఁ
డీ సువర్చలఁ ♦ బెండ్లిఁ జేసికొనును

ఈడ పిల్లను గాంచి ♦ ఆడ పిల్లనుమాట

యేఁడైనఁగైకొన్న ♦ నాఁడు నిజము

పుట్టియుండునుగాని ♦ పుట్టఁబోవఁడుగదా ?

పుట్టిన కన్నె కే ♦ ల్వాట్టు వాఁడు”

తే.గీ. అనుచు జనులాడుచుండుట ♦ నరసి నీవు

స్త్రీయఁగాఁ జూచినా వద్ది ♦ తీయబుద్ధి ॥ఘన. . .॥ 95

సీ. నీయిచ్ఛవలన నే ♦ నీకు విద్యాదాత

రవి ముద్దుగా సువ ♦ర్చలను బిలిచి

అమ్మాయి ! నీ వివా ♦ హమ్ముఁజేయుదు, నీకు

వరుఁ డెట్టివాఁడు గా ♦ వలయు ననిన

నిరుపమ సుఖరూప ♦ నిత్యసంపన్నుని

హనుమంతువరియింతు ♦ నని వచింపఁ

దండ్రి సంతోషించి ♦ తనయ నయోనిజ

దేవిఁగాఁగొనుమనె ♦ దేవ నిన్ను

తే.గీ. గురునితోడ నద్వైతంబు ♦ గూడదనుచు

సమ్మతించితివిగ, సువ ♦ర్చల వరింప ॥ఘన. . .॥ 96

సీ. వరుఁ డాంజనేయుండు ♦ వధువు సువర్చల

వైవాహికము మేరు ♦ పర్వతమున

జరుగును దప్పక ♦ చను దేరవలయును

శుభముహూర్తము జ్యేష్ఠ ♦ శుక్లదశమి

బ్రహ్మానిర్ణీతమ్ము ♦ ప్రకటింపఁబడియెను

బదునాల్గులోకాల ♦ బంధువులకు

స్వామి! నీ వెఱుఁగని ♦ వానిరీతిగనున్నఁ
భారము లోకము వహించె
హరిహరబ్రహ్మాదు ♦ లానందభరితులై
మీటి రొక్కరొకని ♦ నూఱురెట్లు
తే.గీ. పెండ్లియని చూడవచ్చిరి ♦ పెద్దపిన్న
లాడువారలతోఁ గాని ♦ యాడఁ దరమ ||ఘన...|| 97

సీ. నిత్యమంగళరూపు ♦ నినుఁ గ్రొత్తపెండ్లికొ
డుకునుజేసి కూర్చుండ ♦ మనిరి పీట
విశ్వరక్షణదీక్ష ♦ వెలయు నీ చేతికిఁ
గట్టిరి వింతగాఁ ♦ గంకణమ్ము
పరమపవిత్ర స్వ ♦ భావమూర్తికి నీకుఁ
దాల్చ యజ్ఞోపవీ ♦ తముల నిడిరి
ప్రావరణాజ్ఞాన ♦ బంధహీనుని నిన్ను
భక్తిఁగట్టిరి మధు ♦ పర్క మిచ్చి
తే.గీ. బ్రహ్మముఖదేవతా మంత్ర ♦ పఠన విధుల
నిన్నుఁబూజించి యిచ్చిరి ♦ కన్నె సాధ్వి ||ఘన...|| 98

సీ. విధి చతుర్ముఖముల ♦ వెడలు వేదధ్వనుల్
మిన్ను ముట్టినరీతి ♦ నెన్నఁజేసె
లలితసువర్చ లా ♦ లంకార కాంతులు
కమనీయ దశదిశాం ♦ గనలఁ దెలిపె
ఒకరి నొకరు చూడ ♦ కుండఁ బట్టిన తెర
యిరువు రేకమనుట ♦ నెఱుకపఱచె

లోకంబు లానంద ♦ లోకమ్ములని చూపె
నక్షతారోపణ ♦ మాక్షణమున
తే.గీ. స్వామి! సర్వమ్ము నీ ప్రభా ♦ వమున నెసఁగ
వసతిఁ గనని జనుల గుస ♦ గుసలు పొసఁగ ॥ఘన...॥ 99

సీ. వైవాహికమహాత్మ్య ♦ వమ్ముఁ జూడఁగవచ్చి
నట్టివారలఁ గొంద ♦ ఱాలుమగలు
"బంగరు బొమ్మ సు ♦ వర్చల నీ కోఁతి
మొగమువానికి నీయఁ ♦ దగున యరయ?
కోఁతిగాదే, పంది ♦ మూతివాఁడే, గాదు
గరుడాళువారలు ♦ గనుము ముక్కు
సాక్షాద్ధయగ్రీవ ♦ సౌందర్యుఁ డమ్మయో
నరసింహుఁడే చూడు ♦ నాకు భయము"
తే.గీ. అనుచు దోఁచినరీతిగా ♦ ననిన వారి
సర్వముఖసుప్రసన్నత్వ ♦ సరణిఁ గనుదు ॥ఘన...॥ 100

సీ. పరమేశ్వరాదుల ♦ భద్రశ్రుతులతోడ
గౌరికళ్యాణమం ♦ గళముగూడ
శ్రీ మహర్షుల శుభా ♦ శీర్వాదములతోడ
రమ్యకర్పూరహా ♦ రతులుగూడ
నరవానరసుర కి ♦ న్నర సంస్తుతులతోడ
నప్సరోఽంగనల నా ♦ ట్యంబుగూడ
సంతతాశ్రితభ ♦ క్త సంప్రార్థనలతోడ
నడిగినదిచ్చు మ. ♦ ర్యాదగూడఁ

తే.గీ. జెలఁగె నుపమానరహితమై ♦ శ్రీసువర్చ
లాంజనేయవివాహము ♦ హమ్మునాఁడు ॥ఘన...॥ 101

సీ. ఈ వున్నకతమున ♦ నే యున్నగ్రామాల
వన్నెఁగన్నట్టి దీ ♦ ప్రత్తిపాడు
నీ ప్రభావముఁజూడ ♦ నెలకొనఁ బ్రియమయ్యెఁ
పరమేశ్వరున కీ ♦ ప్రత్తిపాడు
నీవు ప్రోచుచునుండ ♦ నిరతంబు శుభవృద్ధిఁ
బడయఁజాలినది యీ ♦ ప్రత్తిపాడు
నీవ సర్వమ్మను ♦ నీ భక్తజనులకు
వసియింపఁదగిన దీ ♦ ప్రత్తిపాడు
తే.గీ. స్వామి! నా జనిఁగనిన దీ ♦ ప్రత్తిపాడు
భద్రముగఁ జూచు నన్ను నీ ♦ ప్రత్తిపాడు ॥ఘన...॥ 102

సీ. చిన్నపిల్లలు నిన్నుఁ ♦ జేతులనాడింత్రు
దసరాదినాలఁ దై ♦ తక్కలనుచుఁ
బెద్దవారును నీదు ♦ ముద్దుమూరితిఁ గాంచి
కరములు ముకుళింత్రు ♦ శిరమువంచి
పండితుండైన నీ ♦ వుండు జాడను జూచి
సాగిలఁబడును సా ♦ ష్టాంగవిధిని
పామరుండును మూఢ ♦ భక్తితో నినుఁ గని
పెళపెళ చెంపలు ♦ వేసికొనును
తే.గీ. ఎవ్వఁడైనను స్వామి! ని ♦ న్నెదుటఁగన్నఁ
గనులుమూయుచు మది నమ ♦ స్కారమునును ॥ఘన॥103

సీ. ఒడళుల నీరూప ♦ మెడలక ధరియింపఁ
బడుచున్న యెడల నె ♦ ప్పటికిఁ జెడవు
దినము నీ జపమంత్ర ♦ తీర్థమ్ముఁ గొనుచున్న
నైన నాధివ్యాధు ♦ లంట వెపుడు
నీ జయంతివ్రత ♦ నియమము ల్గలవారి
కగును సంతాన భా ♦ గ్యాభివృద్ధి
స్వామి! కళ్యాణోత్స ♦ వమ్మున నినుఁ గన్న
వా రెన్నఁ డెట్టి యా ♦ పదలు గనరు
తే.గీ. హనుమ, హనుమంత, మారుతీ ♦ ఆంజనేయ
యనెడునామమ్ములే చాలు ♦ నఘము లుడుప ॥ఘన॥ 104

సీ. బలమైన రోగాల ♦ పాలైనగ్రామాలఁ
బ్రదికించు మందు నీ ♦ భజనముందు
ఘనవిపదంబుధి ♦ మునుఁగులోకంబులఁ
బ్రోవఁగా నావ నీ ♦ సేవముందు
బండపట్టునుబట్టి ♦ యుండు దయ్యాలను
విడగొట్టు పెట్టు నీ ♦ పేరుముందు
మోక్షేచ్ఛలను జుట్టు ♦ మోహపాశంబుల
ఖండించు నీ బత్తి ♦ కత్తిముందు
తే.గీ. అన్నిఁటికిముందు నీ వుందు ♦ వంతముందు
వానిఁ గనుచుందు వంత మె ♦ వ్వాలనఁ గనవు ॥ఘన॥ 105

సీ. శ్రీ మహావిష్ణ్వంశ ♦ శ్రీరామభార్గవ
రాము లొండొరు లెదు ♦ ర్పంగ వినవె?

రామలక్ష్మణా, బల ♦ రామకృష్ణుల భ్రాతృ
సౌహార్దమున రహ ♦ స్యంబుఁ గనవె ?
జాంబవంతుఁడు రామ ♦ చంద్రునిఁ గొనియాడి
గోవిందుతోఁడన ♦ గ్రుద్దులాట ?
త్రేత రామునిఁగొల్చి ♦ తిరిగిన నీవు ద్వా
పరమున శ్రీ కృష్ణు ♦ మఱవనగునె ?
తే.గీ. దేవతలు మార్పుఁజెందుచుఁ ♦ దెలియలేరు
స్వస్వరూపమ్ము, జీవుల ♦ వశమ తెలియ ? ||ఘన...|| 106

సీ. ప్రత్యవస్థను నిరు ♦ వది యేడులెక్కను
నాల్గింట నూటిపై ♦ నాల్గురెండ్లు
తత్త్వమ్ములనియును ♦ తజ్జపసంఖ్యచే
మంత్రసిద్ధియు వినం ♦ బడును శ్రుతుల
సర్వతత్త్వాద్యవ ♦ స్థలకుసాక్షివి నీకు
నష్టోత్తరశతంబు ♦ నర్థమగును
నాజన్మ మిట్లు ధ ♦ న్యంబుఁగాఁజేసిన
నీ కటాక్షమునకు ♦ నేన గుఱిని
తే.గీ. స్వామి! సర్వమ్ము నీది; నా ♦ కేమియాజ్ఞ ?
దేహ మున్నంతవఱకు సం ♦ దేహ మేల ? ||ఘన...|| 107

సీ. బుద్ధిమంతుల గొప్ప ♦ బుద్ధిశాలివి నీవు
నా బుద్ధిలో నిల్చి ♦ నావు గనుక
నీ సము ల్లేరని ♦ నీసము ల్సేసితి
నూటయెన్మిది నీ దయ ♦ నుగ్రహమున

సీసంపు మెత్తన ♦ చే నొక్క యర్థంబు
దివ్యరూపము ముందు ♦ సమ్మతింత్రు
నీ సురూపము ముందు ♦ సీసాన సరిచూచి
నెమ్మనమ్మునఁ గట్టి ♦ దిమ్మఁజేతు
తే.గీ. స్వామి! నా భావ మిది యన ♦ వచ్చునుగద
సర్వభావ స్వరూప సం స్థానివిగద ॥ఘన...॥ 108

సీ. శ్రీమత్పరమహంస ♦ శేఖరవరుని శ్రీ
రామచంద్రేంద్ర స ♦ రస్వతి యతిఁ
గారణగురు మనః ♦ కమలపీఠంబున
వసియింపఁజేసి త ♦ త్పాదపద్మ
(సేవాఽమృతానంద) సేవామృతసుఖ ♦ జీవనైకవిధాన
దేహినై దళిత సం ♦ దేహినైతి
శ్రీ హనుమంత! నీ ♦ స్నేహనామంబుల
కలిమి బలిమి గల్గి ♦ కాంక్ష లుడిగి
తే.గీ. బ్రహ్మమని నిన్ను మదినమ్మి ♦ బహువిధముల
సన్నుతించితి క్షమియింపు ♦ సంతసింపు ॥ఘన...॥ 109

సీ. శ్రీమత్ప్రతాప వం ♦ శీయుఁడ, ఋగ్వేది
నాత్రేయస పవిత్ర ♦ గోత్రిజుఁడను
ఆదెమ్మ, రామయ్య ♦ లను తల్లిదండ్రుల
పుత్త్రులిద్దరిలోన ♦ మొదటివాఁడ
తమ్ముండు నాకు నీ ♦ తారామయయుఁ బుత్త్రి
వంతుండు ననుకూల ♦ వర్తనుండు

అన్నపూర్ణార్ణాన్వర్థ ♦ యర్ధాంగిగా, సాధు
సద్గోష్ఠి సతతమ్ము ♦ సలుపువాఁడ

తే.గీ. (శ్రీ)ప్రసన్నాంజనేయ ప్ర ♦ సిద్ధదేవ
వరసమాహిత శుభబుద్ధి ♦ బలవిరాజ
మానతత్త్వవిచార సం ♦ పదల మెలఁగు
వాఁడ, హనుమయ్య యనుపేరఁ ♦ బరగువాఁడ. 110

గీ. నందనాబ్ద చైత్రాపర ♦ నవమియందుఁ
బ్రత్తిపాడ్గ్రామ హనుమంతు ♦ పదములందు
వందనములతోఁ గృతి సమ ♦ ర్పణమునందు
విబుధులకు నయ్యో పీనుల ♦ విందు ముందు.

ఓమ్—తత్—సత్.

---

ద ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి

# తప్పొప్పుల వివరము

| పుట | పఙ్క్తి | పద్యము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 3 | | సదుర్గు | సద్గురు |
| 1 | 16 | 1 | శ్రీ పసన్నాంజ | శ్రీ ప్రసన్నాంజ |
| 3 | 3 | 5 | లైసనుఁ | ల్త్యైసినుఁ |
| ,, | 5 | ,, | బుటి | బుట్టి |
| 8 | 12 | 16 | గారెఁ | గారె ? |
| ,, | 13 | 17 | నిన్నుఁ | నిన్ను |
| 13 | 5 | 27 | భీష్ముఁడు | ఫీష్ముఁడు |
| 18 | 19 | 39 | డంధ | చాంధ్య |
| 20 | 8 | 43 | యమినీ | యమినె |
| ,, | ,, | ,, | మిటక | మిణక |
| ,, | 13 | ,, | ప్రభవు | ప్రభువు |
| 28 | 21 | 62 | దుషశి | దుష్టశి |
| 35 | 8 | 76 | శ్రీగఁని | శ్రీఁగని |
| 37 | 10 | 80 | నీపయిభార | నీపయినిభార |
| 39 | 5 | 84 | జగములుఁగ | జగములఁగ |
| ,, | 10 | 85 | న్మయము | న్మయముఁగ |
| 45 | 2 | 97 | బారము | కార్యభారమ్ము |
| 47 | 6 | 102 | రునకీ | రునకునీ |
| 50 | 11 | 109 | (సేవాఽమృతానంద) సేవనామృతసుఖ | సేవాఽమృతానంద |
| 51 | 3 | 110 | శ్రీ పసన్నాంజ | శ్రీ ప్రసన్నాంజ |